K.Hanumantha sastry
Kodivedu

శ్రీ ర స్తు.

పూర్వము చంద్రగిరితాలూకా పాకాలపేట వాస్తవ్యులును
నిపుడు రాయవేలూరు మిషన్ కాలేజి తెలుఁగుపండితులును

నగు

ఆలూరు. వాసుదేవ దైవజ్ఞకృ
తాంధ్రతాత్పర్యసహిత

# కేరళప్రశ్నము.



చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే
ప్రకటితము.
1927.

# విజ్ఞప్తి.

---

కత్తిపట్టినవారెల్లరు రాజు లని తలంచినట్లు పంచాంగము
పట్టినవారెల్లరు జ్యోతిశ్శాస్త్ర పారంగతు లని తలంచుట యస
మంజసము. ఈశాస్త్రము సిద్ధాంత జ్యోతి షారూఢ ముహూర్త
వాస్తు ప్రకరణంబు లని యైదు ప్రకరణంబులతో నొప్పుచు
న్నది. వీనిలో నొక ప్రకరణం బెఱింగినవాఁడు మఱియొక ప్రక
రణం బెఱుంగఁడు. రెండు ప్రకరణంబులు తెలిసినవాఁడు
మఱి రెండు ప్రకరణంబు లెఱుంగఁడు. అట్టన్ని ప్రకరణం
బులు తెలిసినవాని నమగురుం డని చెప్పనొప్పును గదా.
అట్లుండఁగాఁ బంచాంగములోని తప్పులు సవరించుకొనుటకు
శక్తుఁడు కానివాఁడు లగ్నస్ఫుట నక్షత్రస్ఫుటాదు లెట్లు సేయఁ
గలండు? అందుమీఁద నడుగువారికి గ్రహాకార కత్వం బెఱింగి
ఫలాఫలము లెట్టుఁ వచింపఁ గలఁడు? తిలతండుల న్యాయం
బువోలె (బియ్యము నూవులు గలసినట్లు) నారూఢ ప్రకరణము
తెలిసియుండువాఁడు జ్యోతిష ప్రకరణంబునం బ్రవేశించి
యీరెండు ప్రకరణములు కలిపి చెప్పిన మాత్రంబున జ్యోతి
ష్యుం డనం జనునే? చిన్ననాఁట నుండి మహేశ్వరశాస్త్రులని
పిలుచుటవలన నతఁడు శాస్త్రులు కానేరఁడు. శాస్త్రపరిజ్ఞాన
ముండువానికి శాస్త్రిలనుటకు సందియంబుండదు గదా."
కాఁబట్టి శాస్త్రపరిజ్ఞాన మొక్కింతయేని యెఱుంగనివానిం
జూచి జాతక మిచ్చి యభీష్టమడుగుటం జేసి, యతఁడు తనకుఁ
దెలిసినట్లు తాఱుమాఱుగ నేదియో యొకటి చెప్పుటయును,
తనయభిప్రాయమున కది సరిగా లేకుండుటయును, అందువలన
నతఁడు చెప్పిన జ్యోస్య మబద్ధంబనియు, జగంబున నీక

## విజ్ఞప్తి.



నీ జ్యోతిశ్శాస్త్రము నష్టఁదగదనియు, నివ్విధంబున నీశాస్త్రంబునకు నగౌరవంబు వాటిల్లఁ జేసిరి. కాని యెంతమాత్రము కల్లశాస్త్రము కానేరదు. శాస్త్రపరిశోధనము చేయించి కష్టపరిహారంబునకు ధనంబిచ్చినను, ఆయాయి ప్రకరణంబు బాగుగ నెఱింగి చెప్పువాఁడు దొరకుటరుదు. దొరికినచో వాని కిష్టపూర్తిగ ధనం బిచ్చుట కష్టము. ధనంబిచ్చుటకు వెఱచి, వీరడిగినందులకును దొరికిన కాసు చాలని శాస్త్రగంధ మెఱుంగనివాఁడు చెప్పి పోవుటకును, శాస్త్ర మబద్ధమనుటకును సాక్ష్య మింకఁ జెప్పవలయునే?

కాఁబట్టియే శాస్త్రమును గురుమూలకముగఁ జక్కఁగఁ జదివి సారమెఱింగి యొరులకుఁ జెప్పుట యది యుచితమార్గము. ధనాశచేఁ దెలియనిదానిఁ దెలుసునని చెప్పుట పాడిగాదు. మఱియు నీశాస్త్రంబున ననేక రహస్య మార్గములుగలవు. వాని గ్రంథవిస్తరభీతిచే నిందు వ్రాయమానితి. ప్రకృత మీకేరళ ప్రశ్న కాంధ్ర తాత్పర్యంబు నాతెలిసినంతవఱకు వ్రాసితి. నీశాస్త్రము ప్రప్రథమంబు "కేరళముని" యనువారిచే వ్రాయబడుట గాక, యిందుఁ గొన్ని యితర మునివర్యుల యభిప్రాయంబులును గలసి ముఖము చూచుకొనుటకు నద్ద మొక సాధనంబుగ నుండినట్లు, తమయభీష్టం బడిగి తెలుసుకొనుటకు నీ కేరళ ప్రశ్న మద్దమువలె నొప్పియున్నది. ఇందలి దోషంబు లెఱింగిన విబుధులు సదయహృదయులై దిద్ది చదువుదురనియుఁ, బాలోపంబుల నెఱింగింతురనియుఁ బ్రార్థించు-

ఆలూరు. వాసుదేవయ్య,

తెలుఁగుపండితులు, మిషన్ కాలేజీ, వేలూరు.

శ్రీ ర స్తు.

ఆంధ్ర తాత్పర్యసహిత

# కేరళ ప్రశ్నము.

---

తే. శ్రీమదాలూరువంశాబ్ధిసోముఁ డైన
వసుధ శ్రీరామకృష్ణదైవజ్ఞ మణికిఁ,
దనయుఁడగువాసుదేవాభిధానుఁ డెలమి
వ్రాసెఁ గేరళప్రశ్న కర్థాదులెసఁగ.

శ్లో. సరస్వ తీందిరా గౌరీ ర్బ్రహ్మ విష్ణు మహేశ్వరాన్,
సర్వాత్మకం చ ప్రణవ మేక మేవ సమాశ్రయే.

తా. సరస్వతిని, లక్ష్మిని, గౌరిని, బ్రహ్మను, విష్ణువును, శివుని, అన్నిరూపులుగలది యగు ఓంకారస్వరూప మయిన పర బ్రహ్మంబును నేను సేవించుచున్నాను.

శ్లో. సాక్షా త్త్రైలోక్యబోధాయ ప్రశ్న కేరళభాషితమ్,
త్రికాలవిషయం ప్రోక్తం తస్మై కేరళయే నమః. 1

తా. జ్యోతిశ్శాస్త్రంబునఁ ద్రిలోకవిషయ మగు త్రికాలజ్ఞానము నొందఁగల "కేరళప్రశ్న" శాస్త్రమును రచించిన కేరళమునివర్యునకు నమస్కారము.

శ్లో. జ్ఞానదీపక మాసాద్య వర్తిం కృత్వా తదక్షరైః,
స్వరస్నేహేన సంయోజ్య జ్వలయే దుత్తరేంధనైః. 2

తా. జ్ఞానం బనెడు దీపంబును బొంది, ప్రశ్నాక్షరంబులనువత్తిఁ బ్రశ్నస్వరము లనెడు చమురుఁ బోసి ఉత్తరంబను సమిధలవలన వెలిఁగింపవలయును.

శ్లో. యదుపచితమన్యజన్మ నిశుభాశుభం తస్యకర్మణః ప్రాప్తిం,
వ్యంజయతి శాస్త్ర మేత త్తమసి ద్రవ్యాణి దీప ఇవ. 3

తా. చీఁకటిం గల ద్రవ్యములు దీపము వెలిఁగించినఁ దెలిసినట్లు జన్మాంతరశుభాశుభకర్మఫలములు ఈశాస్త్రమువలనఁ దెలియనగును.

శ్లో. లోకస్యైవ హితార్థాయ దివ్యచూడామణి ర్మయా,
వక్ష్యతే విబుధార్థానాం శృణుధ్వం స్థిరచేతసా. 4

తా. లోకంబునకు మేలుగలుటకును, ప్రయోజనంబులకుఁజూడామణిరత్నతుల్యం బగు నీగ్రంథము నాచేతఁ జెప్పఁబడుచున్నది. ఓవిద్వాంసులారా; సుస్థిరబుద్ధి గలవారై వినుండు?

శ్లో. చిత్తే యత్తం ధాతుబద్ధం శరీరం
నష్టే చిత్తే ధాతవో యాంతి నాశమ్,
తస్మా చ్చిత్తం యత్నతో రక్షణీయం
స్వస్థే చిత్తే వృత్తయ స్సంభవంతి. 5

తా. సప్తధాతువికారంబగు శరీరము మనసునకు నధీనంబయినది. అట్టి మనస్సు నష్టంబయినచో నాధాతువులు నష్టంబులగును. అందువలనఁ బ్రయత్నముచేతఁ జిత్తము రక్షింపఁ

దగినది. చిత్తము స్వస్థంబుగ నుండినచో మంచిబుద్ధి కలుగక మానదు.

శ్లో. నైత ద్దేయం దుర్వినీతాయ జాతు
జ్ఞానం గుప్తం తద్ధి సమ్య క్ఫలాయ,
అస్థానే హి స్థాప్యమా నైవ వాచాం
దేవీ కోపా న్నిర్దహే న్నోచిరాయ. 6

తా. ప్రశ్నశాస్త్రజ్ఞానమును దుష్టునికొఱకు నీరాదు. అది గుట్టుగ రక్షింపఁబడినట్టులయిన మంచిఫలముకొఱ కగును. అయోగ్యస్థానంబున నుంచినట్టయిన నాసరస్వతి త్వరితంబుగఁ గోపించి దహింపఁజేయును.

శ్లో. వినయావనతాయ దీయమానా
ప్రభవే త్కల్పలతేవ సత్ఫలాయ,
ఉపకృత్యనుచింత కాని శాస్త్రా
ణ్యుపకారస్య పదం హి సాధు రేవ. 7

తా. వినయంబుగల సమర్థున కీయఁదగును. అది కల్పలత వలె మంచిఫల మీఁగలదు. పరోపకారార్థంబులుగా శాస్త్రంబులు చెప్పఁబడినవి. ఉపకరించుటకు సత్పురుషుండు పాత్రుఁ డగుచుండు.

శ్లో. అనర్థే చా ప్యవిశ్వాసే నాస్తికే చాతిశంకిని,
ప్రశ్నోత్తరం న వక్తవ్య ముక్త మ ప్యథ నిష్ఫలమ్. 8

తా. ప్రశ్నచెప్పెడు జ్యోతిశ్శాస్త్రజ్ఞునకు "అర్థము" అనఁగా శక్త్యనుసారంబుగ దక్షిణాతాంబూల ఫలంబులియ్యక వ్యర్థంబుగ నడుగువాఁడు అధికప్రసంగి యనంబడుటగాక, దైవభక్తి లేనివాఁ డనియు, నమ్మకము లేనివాఁడనియు,

శాస్త్రము కల్లయని తలంచువాఁ డనియుఁ జెప్పఁబడును. అట్టివానికి నుత్తరంబు చెప్పుటకు సమకట్టరాదు. చెప్పినను వారి కట్లు ఫలించదు.

శ్లో. సత్య శౌచ దయా యుక్తో దేవతోపాసక స్సదా,
ఆత్మ్యాశావర్జిత స్తస్య వాక్సిద్ధి ర్భవతి ధ్రువమ్. 9

తా. జ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడు ఎప్పుడుగాని దయగల్గినవాఁడై సదాచారసంపన్నుఁడై ఆత్మ్యాశలేనివాఁడై దేవతోపాసనాదులు జేయుచుండినచో వాక్శుద్ధి కలవాఁ డగును.

శ్లో. కించి ద్విజ్ఞాత మప్యర్థం సుఖం బహు సమీరయేత్,
మహత్కష్టం న వక్తవ్యం కించిత్కష్టంతు సూచయేత్.

తా. శుభఫలము కొంచెముగా నుండినను గొప్పఁగాఁ జెప్పవలయును. గొప్పకష్టంబు చెప్పరాదు. అట్టి కష్టము కల్గిన ట్లుండినచో నొకవ్యాజమున సూచించవలెను. అనఁగా అడుగ వచ్చినవారికిఁ జెప్పకుండ మఱియొకరి మూలకంబుగఁ జెప్పించ వలయును.

శ్లో. రాజద్రోహం చ చోరత్వం స్త్రీదోషం నిధి దర్శనమ్,
అనర్థాపాదకం కర్మ జ్ఞాత మప్యప్రకాశయేత్. 11

తా. అనఁగా రాజద్రోహము, దొంగతనము, రంకుతనము, నిక్షేపవిషయము, ఇవి అనర్థకార్యములకులోఁబడునట్లు చేయుట వలన నిట్టివి శాస్త్రంబున నెఱింగినను అడుగువారికిఁ జెప్పరాదు.

శ్లో. సమర్ప్య భక్తిభావేన ఫలతాంబూలదక్షిణాః,
దైవజ్ఞ మీశ్వరం బుద్ధ్యా పృచ్ఛే త్ప్రీత్యయసంయుతః. 12

తా. జ్యోతిశ్శాస్త్రజ్ఞు నీశ్వరునివలెఁ దలంచి ఫలతాంబూల దక్షిణాదులు సమర్పించి, భక్తితోఁడను నమ్మకములోఁడను ప్రశ్న చేయవలయును. ఇఁకఁ బ్రశ్నసూత్రమును దదర్థంబును విశదీకరించెదను.

సూత్రము.—అథాతః ప్రాశ్నకం వ్యాఖ్యాస్యామః, పృచ్ఛకస్య వాక్యాక్షరా ణ్యకారాది స్వరసంయుక్తాని గ్రాహ్యాణి, యది తత్రాక్షరా ణ్యధికాని భవంతి, బ్రాహ్మణం ప్రష్టారం శ్వేతపుష్పాన్యతమం బ్రూహీతి. క్షత్రియం నదీష్వన్యతమాం వదేతి, వైశ్యం దేవాన్యతమం బ్రూహీతి, శూద్రం ఫలాన్యతమం కథయేతి, ప్రతివదేత్తదుక్త్వా తదభిమతం విజ్ఞాయ, తదనుగుణం తత్ప్రశ్నఫలం బ్రూయాదిత్యేకే సమామనంతి.

తా. అనఁగాఁ బ్రశ్నాక్షరంబులను, స్వరములను, వేఱు వేఱుగఁ జక్కఁగ లెక్కించి స్వరంబులకంటె నక్షరంబు లధికంబులుగ నుండినచో, శాస్త్రజ్ఞుఁడు పృచ్ఛకుని ప్రతి ప్రశ్న చేయవలసినది. అదెట్లనఁగా:—"పృచ్ఛకుని జాతి విచారించి యందు బ్రాహ్మణుని తెల్లపూవులలో నొకపూవు పేరు చెప్పుమని యడుగవలయును. క్షత్రియుని నదులలో నొకదానిం జెప్పుమని యడుగవలెను. వైశ్యుని దేవతలలో నొకపేరు చెప్పుమని యడుగవలయును. శూద్రుని ఫలంబులలో నొకపేరు చెప్పుమనియు, ప్రతి ప్రశ్న చేసిన వాఁడు చెప్పినదాని స్వరూపయోగ్యతానుగుణంబుగా వానికి ఫలము గల్గునట్లూహించి తెలుపఁదగు నని కొంద ఱందురు."

మఱియు,

సూత్రము.— అథ సంయుక్త మసంయుక్త మభిహిత మనభిహిత మభిఘాతిక మాలింగిత మభిధూమితం దగ్ధ మిత్యష్టవిధం ప్రాశ్నికం. యది తథా ప్రష్టా స్వకాయం స్పృశేత్తత్స్వం యుక్తం లాభకరం, యది పథి శయానో వాహ గోవా భావరహితః ఫలద్రవ్య వర్జితోవా, పృచ్ఛతి తద సంయుక్తం బహుదినానంతర సుఖలాభకరం, యది సవ్యశయేన పృశేత్సర్వాంగం తదభిహిత మలాభకరం, యది స్వహస్తేన పరకాయం స్పృశతి తదనభిమతలాభకరం స్వప్రయత్నేన పరస్యప్రయోజకంవా, యది మస్తక కటి హృదయ హస్తపాదం మర్దయే త్తదభిఘాతికం శోకాపాదకం, యది దక్షిణకరేణ నిజతనుం స్పృశేత్తదాలింగితం సుఖోదర్కం, యదిదక్షిణపాణినావామకరేణచసర్వాంగం స్పృశతి తదభిధూమితం కించిల్లాభకరం మిత్రాగమన శంసిచ. యది రోదనదుఃఖభయవాక్ జలనీచస్థలే భక్తిహీనః పృచ్ఛతి తద్దగ్ధం నిష్ఫలంచ, యది తదా ఝుర్ఝరవాయన కారణఖంజకుష్ఠికుణి బధిరకుండగోళకాదికం స్పృశతి తదపి దగ్ధం దుఃఖపీడాది బహుళం భవతీతి చేష్టయానుమేయ మిత్యేకే.

తా. అనఁగా (1) సంయుక్తము (2) అసంయుక్తము (3) అభిహితము (4) అనభిహితము (5) అభిఘాతికము (6) ఆలింగితము (7) అభిధూమితము (8) దగ్ధము అని యెనిమిది విధములుగలది. ఈయెనిమిదింటికి లక్షణంబు లెవ్వి యనఁగా:—పృచ్ఛ

ఉండు ప్రశ్న చేయు సమయంబునఁ దనచేతితోఁ దనశరీరం
బును స్పృశింపుచు నడిగినపక్షంబున నా ప్రశ్నకు సంయుక్త
మని పేరు. అందున లాభఫలంబని చెప్పవలయు. మఱియుఁ
బంధుకొని యుండువాఁడును, దారిం బోవువాఁడును, వాహ
నమెక్కినవాఁడును, ఆవశ్యకము లేనివాఁడును, రిక్తహస్తుఁ
డును, ప్రశ్న చేసినచో నది యసంయుక్తమని పేరు. అందు
వలన దినంబులు గడచినపిదప నొకించుక సుఖలాభము గల్గు
నని చెప్పవలయును. మఱియు నెడమచేతితో నెడమ ప్రక్కఁ
దాఁకితే 'యభిహిత' మని పేరు. అందువలన లాభము లేదన
వలయును. తనచేతితో నితరుని శరీరంబును దాఁకినచో నది
'యనభిహితం' బని పేరు. అందుచేఁ దలంచిన కార్యంబు
కాదని చెప్పవలెను. మఱియు నడుము, తల, ఱొమ్ము, చేయి,
కాలు—వీని రుద్దుకొనుచు నడిగినయెడ 'నభిఘాతితం' బని
పేరు. అందులకు శోకకరంబగు ఫలంబని చెప్పవలయును.
మఱియు, కుడిచేతఁ దనదేహమును దడవినచో 'ఆలింగితం'
బని పేరు. అందువలన లాభంబును సౌఖ్యంబును గల్గుననవలెను.
ఇదియునుంగాక కుడిచేత నెడమచేతను దేహంబును దడవు
కొంచు నడిగినట్లయిన 'నభిధూమితం' బనవలయును. అందులకు
గించిల్లాభమనవలెను. మఱియు నేడ్చినను, కనులనీరొల్క మాటా
డినను, భయపడినను, నీటిసమీపమున నిల్చిగాని, పల్లపుస్థల
మున నుండిగాని, భక్తిలేక కఠినముగఁ గాని యడిగినచో 'దగ్ధ'
మని పేరు. అందుకు నే కార్యంబుగాని నిష్ప్రయోజనంబని చెప్ప
వలయును. మఱియుఁ గుక్క, కాకి, కుంటి, గ్రుడ్డి, పొట్టి, కుష్ఠ

రోగి, రంకుకొడుకు, వ్యభిచారిస్త్రీ, దుర్జనుఁడు, విశాలి, విధవ స్త్రీ, దుర్గంధదేహమనుష్యులను, వీరిని తాఁకుచుఁ బ్రశ్నయడిగినచో నదియును 'దగ్ధప్రశ్నంబ' అందులకు దుఃఖపీడాకరంబయిన ఫలమని చెప్పవలయును.

సూత్రము—అథ దృష్ట్యా జీవమూలధాతవ ఉన్నేయా అభ్రాయం.

శ్లో. ఊర్ధ్వదృష్ట్యా భవేజ్జీవ అధోదృష్ట్యాచ మూలకమ్,
సమదృష్ట్యా భవే ద్ధాతు ర్మూలదేవేన భాషితమ్.

తా. అనఁగా నూర్ధ్వదృష్టితోఁ బ్రశ్న చేసినచో మనుష్యాదిజీవచింత యనియు, లేక జీవనోపాయచింత యనియు, అధోదృష్టితో నడిగిన, నది వృక్షాది మూలచింత యనియు, సమదృష్టిచే నడిగినపక్షంబున సువర్ణరజితాది రత్నధాతుచింత యనియుఁ జెప్పవలయును. ఇట్లు మూలదేవసిద్ధమునివర్యుని వలనఁ జెప్పఁబడియె.

సూత్రము—అథాహ్నః కాలేషు త్రిష్వపి త్రిభాగకేషూదయే దేవధాతుమూలాని, మధ్యాహ్నే ధాతు మూలజీవాః. అస్తమయే మూలజీవ ధాతవో జ్ఞేయాః.

తా. అనఁగాఁ బగటి కాలప్రమాణంబును తొమ్మిదిలో భాగంబు లొనర్చి, ఆతొమ్మిది కాలంబులయందుఁ బృచ్ఛకుని తొమ్మిది చింతలును గన్పట్టనగును. ఎట్లనగాఁ, పగటి కాలప్రమాణము ముప్పది ఘడియలలో భాగ మొక్కంటికి ఘడియలు 3, విఘడియలు ౨౦ అగుచున్నయది. సూర్యోదయాది ఘడియలు 3, విఘడియలు ౨౦ వఱకును జీవచింత

యనియు, ౬-౪౦ వఱకు ధాతుచింత యనియు, పిదప ౧౦ ఘడియలు వఱకు, మూలచింత, ౧౩-౨౦ వఱకు ధాతుచింత, ౧౬-౪౦ వఱకు మూలచింత, పిదప ౨౦ వఱకు జీవచింత, ౨౩-౨౦వఱకు మూలచింత, ౨౬-౪౦ వఱకు, జీవచింత, ౩౦ వఱకు ధాతుచింత యనియుం దెలియందగినది. రాత్రి కాలంబునకు విలోమముగ జూడఁదగినది. ౧౦ గడియలు వఱకు నుదయ కాలంబును, ౨౦ ఘడియలు వఱకు మధ్యాహ్న కాలంబును, ౩౦ ఘడియలు వఱకు నస్తమయ కాలంబు ననంబడును.

సూత్రము—అథోదయ మధ్యాస్తే ష్వాలింగితాభిధూమి తదగ్ధా నామవంతి.

తా. అనఁగా పదిఘడియలు మధ్య ముదయ మాలింగిత కాలము, పిదప ౧౦ ఘడియలు అభిధూమిత కాలము, పిదప అస్తమయ ౧౦ ఘడియలు కాలము దగ్ధమనఁబడును. మొత్తము ౩౦ ఘడియలు పరిపోవుచున్నది.

సూత్రము—అథ కాలచేష్టయో రాలింగితయోః ఫల మాలాంగిత మాలింగితాభిధూమిత మాలింగిత దగ్ధయో ర్దగ్ధ మభిధూమితయో రాలింగితమభిధూమితదగ్ధయో రభిధూమిత మభిధూమితాలింగితయో ర్దగ్ధం దగ్ధయో రాలింగితంవగ్ధాభిధూమితయో ర్దగ్ధం దగ్ధాలింగితయో రభిధూమితం ఫల మిత్యగస్త్యః.

తా. అనఁగా ఆలింగిత కాలంబున నాలింగిత ప్రశ్నకు సుఖలాభకరం బని చెప్పవలయును. ఆలింగిత కాలంబున నభిధూమిత ప్రశ్నకుఁ గించిల్లాభంబును మిత్రాద్యాగమనకరంబునగు ననవల

యును. ఆలింగిత కాలంబు దగ్ధ ప్రశ్నకు నిష్ఫల పీడాకరం బని వచింపవలయును. అభిధూమిత కాలంబున నభిధూమిత ప్రశ్నకు సుఖకరం బనియుఁ గార్యానుకూలం బనియుఁ జెప్పవలయును. అభిధూమిత కాలంబున దగ్ధప్రశ్నకుఁ గించిల్లాభంబును మిత్రాద్యాగమనఫలంబు చెప్పవలయును. అభిధూమిత కాలంబున నాలింగిత ప్రశ్నకు నిష్ఫల మగునని చెప్పవలయును. దగ్ధ కాలంబున దగ్ధప్రశ్నకు శుభఫలంబును జెప్పవలయును. దగ్ధ కాలంబున నభిధూమిత ప్రశ్నకు నిష్ఫలశోకకరం బనవలయును. దగ్ధ కాలంబున నాలింగిత ప్రశ్నకుఁ గించిల్లాభకరంబును మిత్రాద్యాగమనకరం బగునని చెప్పవలయును. ఇట్లగస్త్యమునిమతంబు.

సూత్రము—అథ ప్రశ్నాక్షరేషు స్వరవ్యంజనసంఖ్యాసమష్టిర్జ్ఞానాయ స్వరాంకా జ్ఞేయా అకారాది తత్ప్రయష్టి చత్వారింశత్పంచాశత్పూర్ణాని గగనం షష్టిసప్తతీర్వింశతి ర్నవతి శతేచ.

తా. స్వరాంకము-స్వరంబులనఁగా అచ్చులు, వ్యంజనంబులనఁగా హల్లులు. వీనికి అంకము:—అనఁగా గుఱుతు, అదెట్లనఁగా, అ-౭౦, ఆ-౭౦, ఇ-౭౦, ఈ-౬౦, ఉ-౪౦, ఊ-౫౦, ఋ-౦, ౠ-౦, ఌ-౦, ౡ-౦, ఎ-౬౦, ఐ-౭౦, ఓ-౨౦, ఔ-౯౦, అం-౧౦౦, అః-౧౦౦, అనియర్థము.

సూత్రము.—కాదిక్షాంతానాం స్వరగిరి షడ్వేదపూర్ణాని, సప్తర్తువేదగిరి పూర్ణాని, మరుద్భృతువేదాచలపూర్ణాని, స్వరశాస్త్రివేద భూతభూన్యాని, స్వరమరుచ్ఛాస్త్రివేదభూ-

తాని, గిర్యద్రిశాస్త్ర వేదమరుత్స్వరర్తు చాంబరపూర్ణా నిచ.

తా. వ్యంజనాంకము అనఁగా హల్లులలోఁ జెప్పఁబడు సంఖ్యాగుణులు, క-౨, ఖ-౨, గ-౬, ఘ-౪, ఙ-౦, చ-౨, ఛ-౬, జ-౪, ఝ-౨, ఞ-౦, ట-౨, ఠ-౬, డ-౪, ఢ-౪, ణ-౦, త-౨, థ-౬, ద-౪, ధ-౫, న-౦, ప-౨, ఫ-౨, బ-౬, భ-౪, మ-౫, య-,౨, ర-౨, ల--౬, వ-౪, శ-౨, ష-౨, స-౬, హ-౪, ళ-౦, క్ష-౦, ఇట్లూహింపఁ దగినది.

సూత్రము:—అథాంక సమష్టిం త్రిభి ర్విభజ్య శేషైరేకేన జీవో ద్వాభ్యాం, ధాతు శ్శూన్యేన మూల మసంవాదేనై కం నిరేకం వా.

తా. అనఁగాఁ బ్రశ్నాక్షరంబులను బాగుగ వ్రాసుకొని వానిలోఁగల వ్యంజనంబులకును స్వరంబులకును ముందు చెప్పఁబడినట్టి సంఖ్యల నేర్పఱచి, యాసంఖ్య నంతయును మొత్తము సేయఁగా అంకసమష్టి యనంబడును. ఆసంఖ్యను మూఁటిలోఁ గోసివేయఁగా మిగిలిన శేషసంఖ్య ౧-జీవచింత,౨-ధాతుచింత, ౦-మూలచింతాదు లని చెప్పవలయును. చెప్పినది సరిపడక పోయినచో నాలెక్క కొక్కటి యెక్కువగాఁగాని తక్కువగ గాని సరిచేసి చింతను జెప్పవలయును.

సూత్రము—కాలచింతాసారూప్యేణ చింతాం నిర్దిశే త్తయో ర్నిశ్చింతం బలీయః.

తా. అనఁగాఁ బగటికాలమును దొమ్మిదిభాగములు చేసి తెలిసిన చింతయును, ప్రశ్నాక్షరాంక సమష్టివలనఁ దెలియ

వచ్చిన చింతయును, నొక్కటిగా నుండినపక్షంబున బృచ్ఛకుని చింతయూనదియ యని నిశ్చయింపవలయును. అది భిన్నమయిన పక్షంబున వానియందుఁ బ్రబలమయినచింతను నిర్ణయింప వలయును. సందిగ్ధము దుర్బలము. నిశ్చితము ప్రబలం బనం బడును.

## జీవచింతానిర్ణయము.

వ్యా. జీవశ్చతుర్విధః, ద్విపద, చతుష్పద, బహుపదాపద భేదాత్ సంఖ్యాపిండచతుర్భాగావశేషైకేన ద్విపదో ద్వా భ్యాం చతుష్పద స్త్రిభిరపదశ్శూన్యేన బహుపదో జ్ఞేయః.

తా. అనఁగాఁ బ్రశ్నాక్షర సంఖ్యాసమష్టిని నాల్గింట బాల్గొన్న, మిగత ౧-అయితే, నీవు రెండుకాళ్లు గలజీవచింత యడుగుచున్నా వనవలయును. ౨-అయితే నాల్గుకాళ్లుగల జీవంబనియు, 3-అయితే కాళ్లులేనివస్తువనియు, ౦-అయితే బహుపాదంబులు గలదనియుఁ జెప్పవలయును.

వ్యా. ద్విపద శ్చతుర్విధో దేవ నృ పక్షి నారకి భేదాత్.

తా. అనఁగా ౧-దేవత. ౨-మనుజుఁడు, 3-పక్షి, ౦-ప్రే తము.

వ్యా. దేవ శ్చతుర్విధః కల్ప భువనాంతర జ్యోతి ర్వాసి భేదా దేకేన కల్పోద్వాభ్యాం భువనం వనంవా త్రిభి రంత రిక్షవాసిన శ్శూన్యేన జ్యోతిర్వాసిన శ్చేతి.

తా. అనఁగా ముందువలె భాగించినట్టయిన, ౧-మిగిలితే, విష్ణ్వాదిదేవత లనియు, ౨-అయితే అగ్నిగంగానాగాదిదేవత. లనియు, 3-మిగిలితే యక్షపిశాచాదు లనియు, అథవా రాజ

లనియు, ఋషులనియు, ౦-అయితే నవగ్రహనక్షత్రాదులనియు తెలియంగవలయును.

వ్యా. ద్విపదాస్త్రివిధాః పురుష స్త్రీ నపుంసక భేదాత్, త్రిభిర్విభజ్య నిర్దిశేత్.

తా. అనఁగా ముందువలెనే, మూఁటితో భాగించఁగా ౧-మిగిలితే పురుషుఁ డనియు, ౨-మిగిలితే స్త్రీయనియు, ౦-నపుంసక మనియు, తెలియంగవలయును.

వ్యా. తే చ పంచాభీద్యంతే బాలకుమార మధ్య యౌవ వృద్ధా ఇతి.

తా. వాని నైదింట భాగించఁగా, ౧ - మిగిలితే బాలవయస్సనియు, ౨ - కుమారవయస్సనియు, 3 - మధ్యవయస్సనియు, ౪-యౌవనంబనియు. ౦-వృద్ధత్వ మనియు తెలియంగవలయును.

వ్యా. ఆలింగితాభిధూమిత దగ్ధేషు పుం స్త్రీ షండాన్యస్నేయాని.

తా. ఆలింగితం బయితే పురుషుఁ డనియు, అభిధూమితం బయితే స్త్రీ యనియు, దగ్ధం బయితే నపుంసకం బనియు తెలియంగునది.

వ్యా. మనుష్యాః, పంచవిధాః, బ్రహ్మ క్షత్రి వైశ్య శూద్ర నీచాః పంచభాగేన జ్ఞేయాః.

తా. అనఁగా అయిదు భాగములు చేయఁగా,౧-బ్రాహ్మణ, ౨-క్షత్రియ, 3-వైశ్య, ౪-శూద్ర, ౫-నీచు లనఁదగినది.

వ్యా. పక్షీ ద్వివిధో జలస్థలచరభేదాత్,

తా. అనఁగా రెండుభాగములు సేయఁగా, ౧ జలచర పక్షి-హంస, కొంగ మొదలయినవనియు, స్థలచరపక్షి, కాకి, గ్రద్ద, నెమిలి, కోడి మొదలయినవనియు, నదే లబ్ధము అయిదుతో భాగించగా మిగత ౧ - తెలుపు, ౨ - నలుపు, 3-పసుపు, ౪ - పసురు, ౦ - ఎఱుపు, ఇట్లు రంగులు గన్పట్ట నగును.

వ్యా. నారకినో ద్వివిధా యోనిజాః కర్మజాశ్చేతి.

తా. అనఁగా రెండుభాగములు సేయఁగా ౧-పెద్దరోగము మొదలగు దుఃఖంబులు గలప్రాణి, ౨ మహాపాపప్రాణి లేక వృతి యని తెలుపవలయును.

వ్యా. చతుష్పద శ్చతుర్విధః ఖురి నఖి దంతి శృంగి భేదా చ్చతుర్భి స్తష్టే నిర్దేశ్యః.

తా. అనఁగా ౫-భాగశేషము గొఱిసెలు గల్గిన నాల్గు కాళ్లజంతువు, ౨-గోళ్లుగలనాల్గుకాళ్లజంతువు, 3-కోఱలుగల నాల్గుకాళ్లజంతువు, ౪-కొమ్ముగల నాల్గుకాళ్లజంతువని తెలియ వలయును.

వ్యా. ద్వాభ్యాం గ్రామ్య మారణ్యకం చేతి గ్రామ్యా అజ మేష వృషభాదయః అరణ్యాః మహిష గవయ హరిణా

చతురో గజతురగా ఉభయవాసినో వరాహాశ్చ గ్రామ్యాః శృం
గిణో గవాదయః అరణ్యకాః ఖడ్గాదయో మహిషోభయచరా
నఖినస్తు గ్రామ్యమార్జాలాదయ అరణ్య వ్యాఘ్రాదయో దం
ష్ట్రిణో గ్రామ్యా శశకాదయ అరణ్యాస్సింహాదయః ఏవం చతు
ష్పదా ఊహ్యా స్తత్త స్సంఖ్యయా తట్టేన.

తా. రెండుభాగశేషము, ౧ - గ్రామ్యచతుష్పాత్తు- మేఁక,
గుఱ్ఱము, గాడిద, గోవు, ఎనుము, గొఱ్ఱియ, పిల్లి, కుక్క
పంది మొదలయినవి. శేషము, ౦-అరణ్యక చతుష్పాత్తు - జింక
దుప్పి, పంది, పులి, ఎలుఁగుబంటి, సింహము, ఖడ్గమృగము
మొదలయినవి. ఎనుము, పంది, ఏనుఁగు, గుఱ్ఱము, ఎద్దు మొ
దలయినవి. ఉభయచరములు - గొఱిసె, గోరు, కోఱ, కొమ్ము
ఇవి యరణ్యనివాసము, గ్రామవాసము వీని గుర్తులచేత జీవనము
నిశ్చయింపవలయును.

వ్యా. జీవో ద్వివిధో జలచర స్థలచర భేదా త్పున ర్భక్ష్యా
భక్ష్య భేదాచ్చ.

తా. రెండుభాగశేషము, ౧-జలచరజంతుభేదము, ౦-స్థల
చరజంతు. అనఁగా ఎండ్రకాయ, చేఁప, మొసలి, తాఁబేలు
ఇవి జలచరములనియు, కుందేలు మున్నగునవి స్థలచరంబులని
యు, ౨ భాగము, ౧ మనుష్యుఁడు తినఁదగిన జంతువనియుఁ,
దినఁదగనిజంతువనియు నెఱుఁగునది.

వ్యా. పున ర్జీవ స్త్రివిధః పిండాణ్డ స్వేదజభేదాత్.

తా. 3 భాగ శేషము. ౦-౧-గర్భపిండమువలఁ బుట్టెడు గోవు మొదలయినవి. శేషము ౨-గ్రుడ్డువలన జనించెడు పాము పక్షి మొదలయినవి. ౦-శేషము, చెమటవలనఁ బుట్టెడు నల్లి, దోమ, ఈఱుదు మొదలయినవి.

వ్యా. విషమసమష్టిసంఖ్యాయా మభిధూమితదగ్ధయో ర్విష జంతు శ్చతుర్విధః పుచ్ఛదంతశ్వాసాంగ భేదాత్.

తా. అభిధూమిత కాలంబునదగ్ధ చేష్టగల్గిసంఖ్యాసమష్టివిషమ మాదౌ నేని విషజంతువని తెలియవలయును. ౪ భాగ శేషము ౧-తోకయందుఁ గలవిషజంతువు అనఁగా బాము, తేలు మున్నగునవి. శేషము ౨-కోఱయందు విషముగల నాగుపాము, వెఱ్ఱికుక్క, ఊసరవెల్లి మొదలయినవి. 3-ఊసురున విషముగల మండలసర్పాదులు. ౦ - శిరంబున విషంబుగల యీఁగ, ఉరిశింగి మొదలయినవి.

## ధాతుచింతానిర్ణయము.

వ్యా. ధామ్యా అధామ్యాశ్చేతి ధాతవో ద్వివిధా స్తత్ర సువర్ణాదయో లోహా అష్టౌ ధామ్యా స్తే ద్వివిధా ఘటితా ఘటిత భేదా ద్ఘటితో ఽష్టవిధ శ్శిరః కర్ణ గ్రీవా బాహు హృదయ కర కటి పాదాభరణ భేదా త్తే ద్వివిధా దక్షిణోత్తరాంగ ధార్య భేదా ద్భూషణం ద్వివిధం ద్విపదయోగ్యం చతుష్పదయోగ్యం చేతి ధాతు ర్ద్వివిధః పాత్రయోగ్యో ముద్రాయోగ్యశ్చ తత్త త్సంఖ్యయా భాగనిర్దేశః.

తా॥ ధాతుచింతయందు సంఖ్యాసమష్టిని రెంటిచే భాగింపఁగా శేషము. ౧-కరిగింపఁదగినధాతువు ధామ్య మనంబడును. ౦-కరిగింపఁదగనిధాతువు అధామ్య మనఁబడును. ధామ్య ధాతుచింతయందు సంఖ్యాసమష్టిని ౮ చేత భాగించి శేషము ౧-బంగారము, ౨-వెండి, ౩-తామ్రము, ౪-కంచు, ౫-ఇత్తడి, ౬-తగరము, ౭-సీసము, ౦-ఇనుము అని తెలియఁదగినది. ౨-భాగము సొమ్ముగఁ జేయఁబడినది. ౦-పని చేయకుండినది. లబ్ధము ౮ చేత భాగించిన శేషము, ౧-శిరోభూషణము, ౨-కర్ణాభరణము, ౩-కంఠాభరణము, ౪-బాహుభూషణము, ౫-హృదయభూషణము, ౬-హస్తభూషణము, ౭-కటిభూషణము, ౦-పాదభూషణము. మరల లబ్ధమును రెండవభాగము. ౧-దక్షిణాంగభూషణము. శేషము ౦-వామాంగాభరణము. మరల లబ్ధమును రెండుభాగము శేషము. ౧-ద్విపాజ్జంతు యోగ్యాభరణము శేషము. ౦-చతుష్పాజ్జంతుయోగ్యాభరణము. కాఁచియూఁది కఱిగించఁదగిన లోహచింతయందు లబ్ధశేషములను గూడి౨-భాగము శేషము. ౧-పాత్రాది యోగ్యధాతు శేషము. ముద్రాదియోగ్యధాతు ౦-ఈలాగున నెఱుంగవలయును.

వ్యా. అధ్మాతధాతు ర్ద్వివిధో మణ్యాది ర్మృత్తికాదిశ్చ ద్వాభ్యాం భాగో మణ్యాది మాణిక్యవజ్ర ప్రవాళ మౌక్తికపద్మరాగ వైడూర్య నీల మరకత గోమేధిక పుష్యరాగ చంద్రకాంతసూర్యకాంత తాయస్కాంతయామున ద్రోణామృతవార్ష్మ సాలగ్రామ స్ఫటిక ధవళ శిలాపిష్ట శిలాభేదా త్సప్త వింశతివిధః, మృత్తికాది

స్త్రీయుకలోష్టవాలుకాశిష్టభస్మేష్టకాంగా రత్నాకర గైరిక కార్త్రి పిచ్చట కాళక మాక్షిక మనశ్శిలా గంధక రసనాగ కిట్ట మండూర శాలికా పంక కరీష పురీష వల్మీక పాషాణ పర్వత రంగమృత్స్నా సుధా భేదాత్సప్తవింశతివిధాః, తత్ర త్సంఖ్యయా భాగనిర్దేశ శ్చేతి.

తా. అధ్మాతధాతుచింతయందు రెండింట భాగించి శేషము. ౧-రత్నాదులు, ౦-మృదాదులు, లబ్ధము ౨౭ చేత భాగించఁగా శేషము. మాణిక్యము, ౨-హారము అనఁగా వజ్రము, ౩ పవడము, ౪ ముత్యము, ౫ పద్మరాగము అనఁగాఁ కెంపు, ౬ వైడూర్యము, ౭ నీలము, ౮ మరకతము అనఁగాఁ పచ్చ, ౯ గోమేధికము, ౧౦ పుష్యరాగము, ౧౧ చంద్రకాంతము, ౧౨ సూర్యకాంతము, ౧౩ అయస్కాంతము, ౧౪ యమునాఱాయి, ౧౫ శోణభద్రశిల, ౧౬ అమృతశిల, ౧౭ లింగశిల, ౧౮ గంధశిల, ౧౯ స్ఫటికము, ౨౦ తెల్లఱాయి, ౨౧ పిట్టురాయి, ౨౨ వరటుఱాయి, ౨౩ విషహరియనుపూస, ౨౪ దాహమును స్తంభించుపూస, ౨౫ శుక్రుణిపూస, ౨౬ నల్లపూస, ౨౭ పిత్తపుఱాయి అని తెలియవలయును.

అదేప్రకారము మృత్తికాదిగణ మెఱుంగ వలయు ౧త్య్రి జాలకము త్రసరేణు, ౨ పెంకు పెంట, ౩ ఇసుక, ౪ పిండిమన్ను, ౫ ఖూడిదెబట్టిన, ౬ ఇటికెమన్ను, ౭ బొగ్గుమన్ను, ౮ చవుటిమన్ను, ౯ కాలినఱాయి, ౧౦ రేగడమట్టి, ౧౧ బంకమట్టి, ౧౨ హాదిదళపుపల్కులమన్ను, ౧౩ కాకమాక్షిక శిల, అథవా హేమమాక్షికము, ౧౪ మణిశిల, ౧౫ గంధకము.

౧౬ పాదరసము, ౧౭ అభ్రకము, ౧౮ కిట్టకము, ౧౯ ఎఱ్ఱమట్టి, ౨౦ కెంపుమట్టి అదుసు, ౨౧ మలమృత్తు, ౨౨ ఎఱుపు, ౨౩ పుట్ట, ౨౪ గొందతాయి, ౨౫ గొంద, ౨౬ పన్నెమట్టి, ౨౭ సున్నము అని తెలియఁదగినది.

వ్యా. వర్ణః పంచధా శ్వేత కృష్ణహరిత పీత రక్తభేదాత్.

తా. ౫ తో భాగించి శేషము ౧ తెలుపు, ౨ నలుపు, ౩ పసుపు, ౪ పసురు, ౫ ఎఱుపు అని తెలియఁదగినది.

## అథ మూలాచింతానిర్ణయము.

వ్యా. మూలం చతుర్విధం వృక్షగుల్మలతాతృణభేదాత్.

తా. ౪-భాగశేషము, ౧ చెట్టు, ౨-పొద, ౩-తీఁగె, ౪-కసవు అని తెలియఁదగినది.

వ్యా. పునర్మూలం సప్తవిధం జటాత్వక్శాఖాపత్రపుష్పఫల నిర్యాస భేదాత్.

తా. ౭-భాగశేషము, ౧-ఊడ, ౨-పట్ట, ౩-కొన, ౪-ఆకు, ౫-పువ్వు, ౬-కాయ, ౭-చెట్టునుండికాఱెడు జిగటనీరు అని యర్థము.

వ్యా. పునస్సప్తధా వృత్త వక్ర సర్వకంటకి క్షీరకం దీర్ఘ భేదాత్.

తా. ౬-భాగశేషము, ౨-అయితే గుండ్రము, ౨-వంకర కణుపుగల, ౪-ముండ్లుగల, ౫-వాలుగల, ౬-గడ్డగల, ౭-నిడు

వగు వస్తువులు ఇది లబ్ధమును భాగించఁగాఁ దెలియనగును.

వ్యా. పునర్ద్వివిధం సూక్ష్మం చేతి, తద్ద్వివిధం సుగన్ధిదుర్గంధి చేతి, తద్ద్వివిధం భక్ష్య మభక్ష్యం చేతి, తచ్చ షడ్విధం, తిక్త కటు, కషా,యామ్ల, లవణ,మధుర, భేదేన, తదపిద్వివిధంమృదు కఠినమితి, తద్వర్ణః పంచధా శ్వేతకృష్ణహారితరక్త చిత్ర భేదా త్ఫలం చతుర్విధం దీర్ఘ వర్తుల వక్రఫలక భేదాన్మూలం ద్వివిధం, బీజావాపం కాండావాపం చ పునస్త్రివిధంజలసహాతపసహా వాతసహా భేదా త్పున శ్చతుర్దశవిధం ఫలపుష్ప నిర్యాసత్వగ్దారు మూల పత్త్రకాండకాష్ఠభాజనకంటక తృణౌషధలోహ భేదా ద్విభజ్య లబ్ధం శేషేణ సంగుణ్య పునరుత్తరేణ విభజేదితి తత్ర స్థానేన భాగనిర్దేశః.

తా. ౨-భాగము, ౧=సూక్ష్మము, ౦-స్థూలము, మరలరెండు భాగములు చేయు, ౧-సుగన్ధము, ౦-దుర్గన్ధము. మరల రెండు భాగములుచేయు, ౧-తినఁదగినది, ౦-తినఁదగనిది. మరల, ౬-భాగములుచేయు, ౧-చేఁదు, ౨-కారము, 3-ఒగరు, ౪-పులుసు, ౫-ఉప్పు, ౦-తీపు. మరల రెండుభాగములుచేయు, ౧-మెత్తనిది, ౦-గట్టిది, వానివన్నె ౫ తెఱంగులుగలవి. ౧ తెలుపు, ౨ నలుపు, 3 పసుపు, ౪ ఎఱుపు, ౦ చిత్రవర్ణము. మరల నాల్గుభాగములుచేయు. ౧ నిడుపు, ౨ గుండ్రము, 3 వంకర, ౦ చప్పట. మరల మూలదింత రెండు విధాలుగలవి. ౧ విత్తనమై పుట్టునది, ౦ కొమ్మలుగలది, మరల మూఁడుభాగములు చేయు, ౧ నీటిబలమున నగునది, ౨ ఎండవలన నగునది. ౦ గాలివలన

జనునది. మరల, ౧౪ భాగములు చేయ, ౧ కాయము ముఖ్యముగు నది, ౨ పుష్పఫ్ర ఫాణ మయినది, ౩ బంక పాలుకలయోగము నది, ౪ పట్టె నార కలయోగమయినది, ౫ ద్రాక్ష మూలాదుల కలయోగమయినది, ౬ తే కలయోగమయినది ౭ ఆకు లంక కలయోగము, ౮ కంభాల కలయోగము, ౯ పంటకట్టియల కల యోగము, ౧౦ ఓడ సామానుల కలయోగము, ౧౧ మూండ్లు గలది, ౧౨ కసవు, ౧౩ ఔషధము, ౧౪ తోటాదుల కల యోగమయినది. ఇది యక్షరాంకరాశిని తత్తద్విధ సంఖ్యతో భాగించి శేషఫలమును గొనఁగా నాశేషము, విధసంఖ్యచేత భాగింపవలయును.

వ్యా. అ భాంగస్పర్శేన మూలమున్నయే నృస్తోదర బాహౌ పృష్ఠపాదస్పర్శేన వృక్షగుల్మలతావల్లీ కందాని భవేయుః.

తా. మూలచింతయందుఁ బృచ్ఛకుఁడు తలముట్టికొనిన వృక్షచింతయనియు, ఉదరము, బొమ్ము తాఁకినచో, గుల్మ చింతయనియు, భుజములు రెట్టలు తాఁకిన పక్షంబున, చెట్ల యొక్క తొఱ్ఱచింతయనియు, వీఁపుదాఁకిన, తీఁగెచింతయనియు పాదమునంటిన, వేరు గడ్డలచింతయనియు నెఱుంగఁదగినది.

## అథ నష్టప్రశ్నవిచారః.

వ్యా. దైవజ్ఞే ఖం పశ్యతి పృష్టం నష్టం ఖే భవేదథో నిరీక్షకే అథో వక్తవ్యమ్.

తా. జ్యోతిష్యుఁడు పైని చూచుచుండఁగా నెవరేని నష్ట ప్రశ్నమడిగితే యాసొత్తు మీఁదిభాగమునం దున్నదనియు, క్రిందఁ జూచునపు డడిగినందులకుఁ గ్రిందిభాగమునఁ గలదని యుఁ జెప్పవలెను.

వ్యా. యత్ర పృచ్ఛతి ప్రష్టాయ త్రాలోకతే తత్ర వక్తవ్యం తన్నష్టం వస్తు.

తా. అనఁగాఁ బృచ్ఛకుఁడు, ఏమూల నిలిచియడుగునో, ఏతావును జూచునో ఆమూలగాని యాతావునఁగాని సొత్తున్న దని చెప్పఁదగినది.

వ్యా. నష్టదినాది ప్రశ్నదిన పర్యంతదినాని పంచభిర్విభజే దేకాదిక్రమేణ గృహరసాతల దేవాలయ పరవేశ్మచోర గృహేషు తన్నష్టం జానీయాత్.

తా. అనఁగా సొత్తుపోయిన దినము మొదలు ప్రశ్నకాల దినపర్యంతముగల దినములు, ౫ చేత పాల్గొన్నచో, ౧ ఆనష్ట ద్రవ్యము ఇంట నున్నదనియు, ౨ పాతాళమున నున్నదనియు, 3 దేవాలయమునఁ గలదనియు, ౪ పొరుగింటఁ గలదనియు, ౦ దొంగయొద్ద గలదనియుఁ దెలియఁదగినది.

వ్యా. అత్రేదం శంఖలిఖితా వాహతుః.

శ్లో. నష్టా త్ప్రశ్నాంత ఘటికా తాడితాక్షరసంఖ్యయా,
పూర్వోక్త యాప్తయా వర్గైశ్చైవ తాడితలబ్ధయా.
ద్రవ్యగ్రామ గృహస్థానం చోరజ్ఞానం వినిర్దిశేత్,

స్వరం వ్యంజనసంఖ్యాభి రనురూపాభి రంతతః.
యోజ్యమానాక్షరై ర్భాజ్యం తత్తన్నామాక్షరావళిః,
తృతీయం ప్రథమం యోజ్యం చతుర్థమపి పంచమే
ద్వితీయంచ తృతీయేఽపి చతుర్థే పంచమం తథా,
వ్యంజనానయనే త్వేవం స్వరానయన మన్యథా.
పంచమే ద్వితీయం త్యాజ్యం చతుర్థే పంచకం త్యజేత్,
తృతీయే చాష్టకం హిత్వా షడూనం తు ద్వితీయకమ్.
ప్రథమం తు తదేవ స్యా దితి నష్టాప్తి సాధనమ్.

తా. అనఁగా శంఖలిఖితులను వారు చెప్పినయభిప్రాయ మెట్లనఁగా—ప్రశ్నాక్షర స్వరవ్యంజనాంక రాశిని, నష్టజ్ఞాన కాలము మొదలు ప్రశ్నకాలము వఱకు గడిచిన ఘడియలలో గుణించి అ క చ ట త ప య శ వర్గలతో భాగించి శేషమును వరుసగా వ్రాసి, మరల నా శేషముతో లబ్ధమును గుణించి పిదప నదేవిధముగా వ్యంజనాక్షరంబులను సాధింపవలసినది. సంఖ్యా శేషశూన్యమైనది యంతలో విరమించును. వానిలో కాదిపంచవర్గమునందే ప్రత్యేకముగ విభక్తాగత శేషములను బట్టి, ౧ నష్ట ద్రవ్యనామము, ౨ గ్రామనామము, 3 ఇంటి పేరు, ౪ స్థలముపేరు, ౫ దొంగపేరు. తెలియఁగలందులకు నుపయోగింపవలసినది. సమష్టిసంఖ్యను వ్యంజనసంఖ్యతోఁ జేర్చి స్వరసంఖ్యతో భాగించఁగా లబ్ధమును వరుసలో స్వరము లగును. వానిని పూర్వోక్త వ్యంజనములతోఁ క్రమానుసారం బుగ జతపఱచినది నామాక్షర పఙ్క్తి యగును. ఇది సంస్కృత భాషను దెలియఁదగినది, 3 వర్గములో భాగింపఁ బడినదానిని

మొదటివర్గముతోఁ గలుపవలయును. ౪-వ దానిని, ౫-వ దానితో, ౨-౩-౪-౫ కూడవలసినది. ఈక్రమము వ్యంజనా క్షరములను సాధించువేళ జ్ఞప్తియుంచఁదగినది. స్వరములను సాధించువేళ వేఱువిధము, ౫, లో, ౭-౪ లో, ౫ లో ౩లో, ౮-౨ లో, ౬ మొదలు నాల్గవ సంఖ్యాగణము రెండవ సంఖ్యా గణమునందు సంఖ్యను వ్యవకలనము చేయఁదగినది, మొదటి సంఖ్యకు నీవికల్పములేదు. ఇది నష్టద్రవ్యమును కనిపట్టి మరల సంపాదించుకొనుటకు ముఖ్యసాధనము. ఈవిషయము సంప్రదాయప్రకారము గురువును సేవించి తెలుసుకొనఁదగినది.

శ్లో. అష్టకోణం లిఖే చ్చక్ర మష్టవర్గా న్వినిర్దిశేత్,
ప్రష్టా స్పృశతి యత్కోణం తత్కోణాక్షరసంఖ్యయా.
ప్రాగుక్తయా తు సంపిండ్య ప్రశ్నప్రాథమికాక్షరే,
సంయోజ్యాక్షరసంభక్త శేషనామాక్షరం వదేత్.

తా. అష్టకోణచక్రంబునందుఁ బూర్వోక్తాష్టక వర్గాక్షరంబులను వరుసగా వ్రాసి పృచ్ఛకుఁడు స్పృశించిన కోణాక్షరములకుఁ గలపూర్వోక్తసంఖ్యను వ్రాసి మొత్తముచేసి ప్రశ్నాక్షర సంఖ్యతో గుణించి అక్షరమాతృకాసంఖ్యతో భాగించఁగా శేషము నామాక్షర మగును.

శ్లో. ఇ ఈ పంచగుణం ప్రోక్తం ఉ ఊ సప్తగుణం తథా,
ఏ ఐ ఏకాదశగుణం ఓ ఔ మద్గుణితం క్రమాత్.
సామాన్యం ద్విగుణీకృత్య గతలగ్నసమన్వితమ్,

స్వరసంఖ్యాహృతే శిష్టం చోర నామాది మస్వరః,
సమష్టివర్ణసంఖ్యాత్తే చోర నామాదివర్ణకః,
కాలదేశానుమానేన సర్వమన్యత్సమున్నయేత్.

తా. ప్రశ్నాక్షరములయందు, ఇకార ఈకారములను అయిదులో, ఉకారఊకారములను ఏడుచేతను, తక్కిన యచ్చులను రెండుచేతను గుణించి, యామొత్తమునకు గత లగ్నసంఖ్యఁ గూర్చి ప్రశ్నాక్షరములయం దెన్నిస్వరములు గలవో, యన్నింటిచేత భాగింపఁగా శేషించినది చోరనామమున మొదటియక్షరమునకు స్వరమగును. ఈలాగునఁ బ్రశ్నాక్షరసమష్టిని యక్షరమాతృకాసమష్టితో భాగింపఁగాఁ జోరనామమునఁ బ్రథమాక్షరము వచ్చును. వ్యంజనాక్షరముల (హల్లులు) గుణకారసంఖ్య గురూపదేశగమ్యంబు. తక్కిన వానిని ప్రకృతోచితంబుగ నూహించుట మంచిది.

శ్లో॥ పూర్వోక్తాక్షరసంఖ్యాయా ద్వాదశాంశకరాశిషు,
గ్రామక్షేత్ర చతుర్మార్గ రసాతల నభస్సు చ,
శూన్యాగారే పథి గృహే పరగ్రామే గృహోపరి,
తటాకే చ నదీతీరే నష్టవస్తు వినిర్దిశేత్.

తా. పూర్వోక్త ప్రశ్నాక్షర సంఖ్యాసమష్టిని పండ్రెండుతో భాగించి యొకటిమొదలు పండ్రెండువఱకు శేషమును రాశిగఁ దెలియవలెను. మేషము స్వగ్రామమునందును, వృషభము స్వక్షేత్రములను, మిథునము బహుమార్గములు చేరిన తావున, కర్కాటకము భూమిలోపలను, సింహము నాకాశ

మునను, కన్యనిర్జానువ్యగృహంబునను, తుల దారియందు, వృశ్చికము పరగృహంబున, ధనుస్సు పరగ్రామమునను, మకరము గృహంబుమీఁదను, కుంభము చెఱువుదగ్గఱను, మీనము నదీతీరమున, అథవా నీటిలోఁపలను గలదని నిర్ణయించఁదగినది.

### అథ చింతావిశేషనిర్ణయః.

వ్యా. అథ సంయుక్తాద్యష్టానుక్రమేణ, ఉత్తమం మధ్యమం లాభం, జీవం, లాభం, సంయోగ మర్థం యోగం చేతి చింతయేత్.

తా. అనఁగా సంయుక్తప్రశ్నమయినచో నుత్తమ విషయ చింత, అసంయుక్త ప్రశ్నమున మధ్యమచింత, అభిహితంబున లాభచింత, అనభిహితంబున జీవచింత, ఆభిఘాతికంబున లాభచింత, ఆలింగితంబున సంయోగచింత, అభిధూమితంబున ధనచింత, దగ్ధంబున యోగచింత యని యిట్లెఱుంగవలయును.

శ్లో. పిండే ప్రశ్నాక్షరాంకానాం తష్టే ద్వాదశభి ర్భవేత్,
రాశి ర్మేషాదికో మేషే ద్విపాదః పరిచింత్యతే.
చతుష్పదంచ వృషభే యుగ్మే యుగ్మంచ గర్భిణీ
వ్యాపారం వ్యవహారం చ కర్కటే పరిచింతయేత్.
రాజకీయం తథా సింహే కన్యాయాంచ వివాహకమ్,
తులాయాం చింత్యతేధాతు ర్వృశ్చికే రోగచింతనమ్.
ధనలాభం ధనూరాశౌ మకరే కలహం రిపోః,
కుంభే గర్భధనం గోప్యం మీనే స్థానవినిర్గమః.

తా. అనఁగాఁ ప్రశ్నాక్షర సంఖ్యనుష్టిని పండ్రెండుతోఁ భాగించి, శేషము మేషాదిగ రాశిగణనము చేసుకొని ప్రశ్న చెప్పవలయును. ఎట్లనఁగా:—౧-మేషమునందు ద్విపాదజీవ చింత యనియు, ౨-వృషభమునందుఁ జతుష్పాజ్జీవచింతయనియు, 3-మిథునమున రెండువిషయములతోఁ జేరిన కార్యముగాని, లేక గర్భిణీసంగతి యనియు, సంతానవిషయ మనియు, ౪-కర్కాటకమున వ్యాపారాదు లనియు, వ్యవహార మనియు, ౫-సింహమునందు రాజకీయవిషయాది గౌరవమును, ౬-కన్యయందుఁ గన్యావిషయము, వివాహము, స్త్రీచింత యనియుఁ, ౭-తులయందు ధాతువాణిజ్యచింత లనియుఁ, ౮-వృశ్చికంబున నాలస్యరోగ విషజంతు హింసాదులనియు, ౯-ధనుస్సున ధనలాభభూలాభాయుధాదులనియుఁ, ౧౦-మకరంబునందు శత్రుకలహకారాగృహాది విషయంబులనియు, ౧౧-కుంభంబున గర్భచింతయుం, లేక గోప్యవిషయమును, ౧౨-మీనంబున స్థానచింతయుం గమనాగమనచింత యనియుఁ రాశిస్వభావమునుబట్టి చెప్పవలయును.

వ్యా. మతాంతరే తు, తేష్వేవ క్రమేణ సువర్ణరజితాది లోహవస్త్రకార్పాసధాన్య ధనజలచరసూత్ర నానాద్రవ్యాణి చింత్యంతే.

తా. అనఁగా మేషమున బంగారమును, వృషభంబున వెండియును, మిథునంబున రాగియనియు, కర్కాటకంబునఁ గంచును, సింహంబున నినుమనియుఁ, కన్యయందు వస్త్రాదులనియు, తుల

యందుఁ బ్రత్తి మొదలయినవనియుఁ, వృశ్చికంబున ధాన్యాదులనియుఁ, ధనుస్సున ధనసంబంధము లనియుఁ, మకరంబున జలజంతువు లనియుఁ, కుంభమును నూలుత్రాళ్లు మొదలయినవనియుఁ, మీనంబున నానావిధద్రవ్యంబు లనియుఁ దెలియంగవలయును.

## లాభాలాభ నిర్ణయః.

వ్యా. సంయుక్తే లాభః, తదా చంద్రనాడీవహేన్న లాభః, ఏకేనాప్యభిఘాతితేన మందలాభః, అభిఘాతితే సూర్యనాడీవహేన్న ద్వాభ్యాం భాగో లాభశ్చ, దగ్ధేనాస్తిలాభః, శూన్యేనాపి చంద్రసూర్యనాడీ కావహేత్, అనభిహితే దగ్ధేనాస్తి లాభః, విపరీతే త్వసిలాభః, కాలచేష్టయోః ప్రబలేన దుర్బలస్య బాధః సత్త్వవిషయాణాం ప్రాతః. రజసో మధ్యందినం, తమసస్సాయమితి కాలబలం, పుంసాం దక్షిణాంగే స్త్రీణాం వామాంగే చేష్టాబలం, దైవజ్ఞస్యవృత్తిలోపాలోపా నిమిత్తాంతరాణిచ నిమిత్తానీతిక్, వామనాసా స్వరశ్చంద్రనాడీ,దక్షిణనాసా స్వరస్సూర్యనాడీ, సుషుమ్నాస్తంభ శ్శూన్యనాడీ, సుషుమ్నా స్ఫురణం పూర్ణనాడీ, స్త్రీ శీతశుక్ల సౌమ్యవిషయాణాం చంద్రనాడీ సుఖం, ఉష్ణపురుష క్రూరవిషయాణాం కృష్ణపక్షే దివాచ సూర్యనాడీ సుఖం, శూన్యనాడ్యాం ఫలభంగః, పూర్ణనాడ్యాం ఫః పూర్ణతేతి మంతవ్యం, సంయుక్తాదృష్టప్రశ్నానాం సూర్యాది రాహ్వంతగ్రహాః క్రమేణ నాథా భవంతి, తేషు సూర్యాంగారక శనిరాహవః క్రూరాః, చంద్ర బుధగురుశుక్రా

సౌమ్యాః గ్రహానురూపఫలం భవతి, అనుక్త మన్యతో గ్రాహ్య మితి సంక్షేపః.

తా. సంయుక్తప్రశ్నమైతే ప్రయోజనలాభము. అప్పుడు చంద్రనాడి యాడెనేని లాభము కానేరదు. అభిధూమిత ప్రశ్నమయినచోఁ గాలయాపనమువలన లాభము కల్గును. అభిఘాతికప్రశ్నమునందు సూర్యనాడి యాడినపక్షంబున ఫలభాగ ములేదు. దగ్ధమున లాభములేదు. శూన్యమునఁ జంద్రనాడి సామ్యంబయినచోఁ బ్రశ్నఫలము శూన్యం బగును. అనభిహిత కాలమునందు దగ్ధప్రశ్నమయిన లాభములేదు. అది వ్యత్యస్త మయినచో లాభము కల్గును. కాలప్రశ్న చేష్టాప్రశ్నములలోఁ బ్రబలమగు దానివలన దుర్బలంబునకు భంగము కల్గును. ప్రాతర్మ ధ్యాహ్నసాయాహ్నముల యందు సత్త్వరజస్తమోగుణకార్య ములను వరుసగాఁ గాలబలముగల్గి యుండును. పురుషులకు దక్షి ణాంగచేష్టయును, స్త్రీలకు వామాంగచేష్టయు బలకరం బయి నది. ప్రశ్న యడుగునప్పుడు జ్యోతిష్యుని సుఖదుఃఖంబులును శకునములను ప్రష్టకుఁ గల్గు ఫలమునకు సూచకంబు లగు చున్నవి. ఎడమముక్కున నుసురు ఆడితే యది చంద్రనాడి, కుడిముక్కున నుసురాడితే యది సూర్యనాడి, అది చలించి నచోఁ బూర్ణనాడియనంబడును. స్త్రీ, సిత, శుక్ల, సౌమ్య విషయంబులకుఁ జంద్రనాడి మంచిది. పురుషోష్ణక్రూర విషయ ములకుఁ గృష్ణపక్షంబునకుఁబగటికిని సూర్యనాడిబలము. శూన్య నాడి ధనఫలశూన్యము. పూర్ణనాడి ఫలపూర్ణమగును. సంయుక్త ము మొదలు, ౮-ప్రశ్నములకు సూర్యాదిగ్రహము లధిపతులు.

వారిలో సూర్య కుజ శని రాహువులవలనఁ గ్రూరఫలము, చంద్ర బుధ గురు శుక్రులవలన మంచిఫలము. ఈలాగు ఫలశాస్త్రము నంతయు నుపయోగించి పృచ్ఛకుఁ డడిగిన కార్యసిద్ధిలాభా లాభంబులను నిర్ణయించి చెప్పవలయును.

## కాలనిర్ణయము.

శ్లో. ఆలింగితే దినం ప్రోక్తం మాసం స్యా దభిధూమితే,
దగ్ధే తు వత్సరం ప్రోక్తం మూలదేవేన భాషితమ్.

తా. ఆలింగితప్రశ్నకు నొకదినము, అభిధూమిత ప్రశ్నకు నొకనెల, దగ్ధప్రశ్నకు నొకసంవత్సరము. ఇటు ఫలపరిమాణకాల మెఱుంగవలయు నిట్లు మూలదేవుఁ డనుముని చేఁ జెప్పఁబడినది.

## జయపరాజయనిర్ణయము.

వ్యా. తత్రాలింగి తాభిధూమిత దగ్ధేషు జయసంధి పరాజయా స్స్యు రక్షరాంక పిండం త్రిభి ర్విభజే దేకేన జయో ద్వాభ్యాంసంధి శ్శూన్యేన భంగో దక్షిణే ప్రష్టా జయం సమ్ముఖే సంధిం పృష్ఠే మరణం ప్రాప్నోతి శత్రువశోవా.

తా. అనఁగా నాలింగితప్రశ్నమయిన జయము కల్గును. అభిధూమితప్రశ్నకు సంధి యగును. దగ్ధప్రశ్నకు నపజయంబగును. అక్షరాంకసమష్టిని మూఁడుచేతభాగించిన శేషము,౧-జయము,

౨-సంధి, ౦-భంగము, దక్షిణమున నడిగినచో జయము, ఎదుట నడిగినచో సంధి, వెనుక యడిగినేని మరణము, అథవా శత్రు బాధ, ఇట్లు జరుగును.

## జీవనవిషయము.

శ్లో. అక్షరపిండద్విగుణం మాత్రాపిండం చతుర్గుణం భక్తమ్,
త్రిభి శేషద్వ్యర్థేషు చ జీవనపీడా వినాశనానిస్యుః.
విషమాక్షరేణ మరణం పీడాభూయాత్సమాక్షరేణాపి,
అజ్ఝుల్ సమతాయామ స్యతీవ సౌఖ్యేన జీవతి ప్రష్టా.

తా. అనఁగాఁ బ్రశ్నాక్షరములలో నక్షరసంఖ్యారాశిని రెంటితో గుణించి స్వరసంఖ్యారాశిని నాల్గింట బెంచి యీ రెంటినిఁగూడి మూఁటిలో భాగించిన శేషము, ౧ జీవనసౌఖ్యము, ౨-కష్టము. ౦-మరణసమీపము. విషమాక్షరంబులయితే మరణసమీపము, సమాక్షరంబులయినచో దుర్బలఫలము. స్వరములు అచ్చులకు సమంబయిన పక్షంబున జీవనసౌఖ్యంబును నగు ననవలయును.

## గమనాగమనవిషయము.

శ్లో. విభక్తశేషైకేన గమనం నిశ్చితం భవేత్,
ద్విశేషేతు విలంబేన శూన్యశేషేన గచ్ఛతి.

తా. ప్రశ్నాక్షర సంఖ్యాసమష్టిని మూఁటిలో భాగించిన చో శేషము, ౧-ప్రయాణము, ౨-ప్రయాణమాలస్యము ౦-ప్రయాణము లేదని చెప్పవలయును.

## సత్యాసత్యనిర్ణయము.

శ్లో. తథా త్రిభక్తమేకేన సత్యం ద్వాభ్యా మనిత్యకమ్,
శూన్యేన మిశ్రం విజ్ఞేయం పృచ్ఛకోద్దిష్టలక్షణమ్.

తా. అనఁగా అక్షరసంఖ్యారాశిని త్రిభాగ మొనర్చినచో శేషము, ౧యథార్థము, ౨-అబద్ధము, ౦-మిశ్రము. ఇట్లెఱుంగఁదగినది.

## దృష్టాదృష్టనిర్ణయము.

శ్లో. దృష్టాదృష్టం ప్రాగ్వదే వాలింగితే దృష్ట ముచ్యతే,
దశాహే నాభిధూమ్రేతు దగ్ధపక్షేణ దృశ్యతే.

తా. ప్రశ్నాక్షర సంఖ్యాపిండమును మూఁడుభాగములుచేసి, శేషము, ౧-అగపడుననియు, ౨-అగపడదనియు, అగపడి చెడిపోవుననియు, ఆలింగిత ప్రశ్నమైనచో నగపడుననియు అభిధూమితం బయినఁ బదిదినంబులు గడచినపిదప నగపడుననియు, దగ్ధప్రశ్నమాయెనేని పదేనుదినంబులు గడచినపిదప నగపడుననియు నిర్ణయించి చెప్పవలయును.

## సుఖదుఃఖనిర్ణయము.

శ్లో. ప్రశ్నవ్యంజనసంఖ్యాం తు గణయే త్స్వరసంఖ్యయా,
తద్వర్గం గుణసంయుక్తం తచ్ఛేషేణ శుభాశుభమ్.
జ్ఞేయ మేకేన తు సుఖం ద్వాభ్యాం దుఃఖం వినిర్దిశేత్,

తూ ర్యే మిశ్రమితి ఖ్యాత ముభయం వా న విద్యతే,
పాపాధిక్యే భవే న్నిద్రా శుభాధిక్యే విరాగతా.

తా. అనఁగాఁ బ్రశ్నాక్షరములయందు వ్యంజనంబులను స్వరములతో గుణించి వర్గించి మూఁటితో భాగించిన శేషము, ౧-సుఖము, ౨-దుఃఖము, ౦-మిశ్రమము, పాపలక్షణ మధికంబయిన పక్షంబున నిద్రవోయిన ట్లేమియుం దెలియంగఁదు. శుభ భలక్షణము లధికంబయినచో వైరాగ్యంబు కల్గును.

## సుభిక్ష దుర్భిక్షనిర్ణయము.

శ్లో. ప్రశ్నాక్షరాంకపిండస్య త్రిఘనం పంచభిర్హరేత్,
శేషం సుభిక్ష దుర్భిక్ష జలభంగఫలక్షయాః,
రాజికం దైవికం వాస్యా న్మూలదేవేన భాషితమ్.

తా. ప్రశ్నాక్షర సంఖ్యాసమష్టిని త్రిఘనముచేసి, అయిదుతో భాగింపఁగా శేషము. ౧-సంవత్సరమువఱకు నాఫలము సమష్టిగా దేశమున కంతయుఁ గల్గెడుఫలము తెలియవలసిన పక్షంబున రాజగువాఁ డడుగఁదగినది. శేషము ౧-సుభిక్షఫలము ౨-దుర్భిక్షఫలము, 3-పంటలు లేదనవలయు, ౪-పంటలుండినను చెడిపోవును. ౦-రాజులు యుద్ధములవలనఁగాని అంతట గల్గిన యనావృష్టివలనఁగాని, అథవా వ్యాపకసాంఘాతికరోగములవలనఁగాని తొందఱ గల్గునని మూలదేవముని ప్రోక్తము.

## అర్ఘనిర్ణయము.

వ్యా. త్రిభక్తశేషప్రశ్నేన చాల్పార్ఘం ద్వాభ్యాం సమార్ఘం శూన్యేనార్ఘవృద్ధి రితిసాధారణం, తత్రద్రవ్యాసా మాస రాంక సమష్టిం ప్రశ్నాక్షరై స్సంగుణ్య కాలాంతేన సంయోజ్య త్రిభి ర్విభజేత్, తచ్ఛేషేణ ప్రకృతార్ఘాల్పతనా నిర్దిష్టకాలాత్వేకేన కించిన్న్యూనార్ఘతా ద్వాభ్యాం సమతా శూన్యే నార్ఘాధిక్యం బ్రాహ్మణప్రశ్నే విపర్యయో రాజన్యప్రశ్నే సమతా వైశ్యప్రశ్నే ద్విగుణం క్రయవిక్రయప్రశ్నే వణిక్యమం విజ్ఞాయత ఇత్యాహ భగవాన్ గర్గః.

తా. పూర్వోక్తప్రశ్నాక్షరసంఖ్యాసమష్టిరాశిని మూఁటితో భాగించినచో శేషము. ౧-అల్పార్ఘము, ౨-సమార్ఘము, ౦-అర్ఘవృద్ధి, ఇది సర్వసాధారణఫలము. ఈపదార్థము వెలయెక్కువగునా యని యడిగినట్లాలయిన నాపదార్థనామము వ్రాసి పూర్వోక్తప్రకారము స్వరవ్యంజనసంఖ్యాసమష్టి నేర్పఱచి ప్రశ్నాక్షరంబుల సంఖ్యాసమష్టితో అథవా అక్షరసంఖ్యతో గుణించి పృచ్ఛకుఁ డడిగినకాలము, అప్పటికెన్ని నెలలుగాని, యదే నెలయందు నెన్నిదినంబులుగాని, వ్యవధానము గల్గియుండునో యంత సంఖ్యను దానితోఁ జేర్చి మూఁటితో భాగించిన శేషము. ౧ వెలకొంచెము తగ్గియుండును, ౨-వెల సమముగనుండును, ౦-వెలయెక్కువగును. ఈప్రశ్న వ్యాపారార్థిగ బ్రాహ్మణుం డడిగినచో వ్యత్యస్తముగ వచింపవలయును. రాజడిగినపక్షంబున నిదేలాగు చెప్పవలయును. వైశ్యుఁడడిగితే ధర రెట్టించియుండు

నవలయు. నితరుఁడయినచో నప్పటికి నీ గణితాగతఫలము సరిగా జరుగునని భగవంతుఁ డగుగార్గముని వచించిరి.

## గర్భచింతాఫలము.

శ్లో. త్రిభిర్భాగః, ఆలింగితేగర్భః, ఏకే నాభిధూమితే గర్భోనాస్తి ద్వాభ్యాం దగ్ధేన గర్భపాతః, శూన్యే నాలింగితేమాసే గర్భః, పుం జన్మ చ, అభిధూమితే స్త్రీ, దగ్ధేవం దం, ఓష్ఠ కంఠ గ్రీవా నేత్ర లలాటకర్ణస్పర్శే నఖంస్పృష్ట్వా సమ్ముఖే పృచ్ఛతి పుత్రజన్మ, నాభిహస్త చాద స్తనం స్పృష్ట్వాపృచ్ఛతి స్త్రీజన్మ. ద్వాభ్యాం భాగ ఏకేన గారో, ద్వాభ్యాం శ్యామః, సంఖ్యాసమష్టి మష్టాభి ర్విభజ్య కుజోదయే రోగః, రాహూదయే ప్రణః, శన్యుదయే మరణం, శుభోదయే జాతో జీవతి, పునస్తల్లబ్ధం పంచభి ర్విభజ్య ఏకే శేషే మాతాపితృసుతక్షేమః, త్రిభి శ్శూన్యేన చ తథా బోద్ధవ్యం ద్వాభ్యాం పితృగండః, చతుర్భి ర్మాతృగండః, స్త్రీజాతకే తద్విపరీత మితి.

తా. మూఁడింట భాగించినశేషము ౧-ఆలింగతచేష్టయుండినచో గర్భముఁ గలదనియు, అభిధూమితం బయినచో గర్భము లేదనియు, ౨-వ శేషమునకు దగ్ధమనియు నిందు గర్భస్రావం బగుననియు, శేషము, ౦-ఆలింగితమునకు నడిగిన నెలలో గర్భమగుననియు, నది పురుషజననం బనవలయు, ౧-అభిధూమితంబునందు స్త్రీగర్భంబనియు, మఱియు దగ్ధం బయిన

చో నపుంసకజననంబనియు, మఱియు నడుగువాఁడు పెదవి, గొంతు, కన్ను, నొసలు, చెవులు, తల, గోరు, తొడ తాఁకుచు నడిగితే పురుషజననంబనియు, చేయి, కాలు, బొమ్మ, బొడ్డు ఇవి తాఁకుచు నడిగినచో స్త్రీజననంబనియు, నదియునుంగాక సంఖ్యను రెంటితో భాగించినచో, ౧-శేషమునకు జనించినశిశువు శ్వేతవర్ణముగ నుండుననియు, ౨-నలుపురంగు గలబిడ్డయనియుఁ జెప్పఁదగినది. మఱియు సంఖ్యాసమష్టి నెనిమిదితో భాగించిన శేషమును సూర్యాదిగ్రహంబు లని భావించి అందు నంగారకునివలన శిశువుకు రోగము కల్గుననియు, రాహువువలనఁ గుఱుపులు మున్నగునవి కల్గుననియు, శనివలనఁ బ్రాణభయము కల్గుననియు, శుభగ్రహమువలనఁ బుట్టినబిడ్డకు శుభఫలమును జెప్పవలయు. మఱియు నాలబ్ధసంఖ్యను అయిదుతో భాగించినచో ౧-తలిదండ్రులకును శిశువునకును సౌఖ్యంబనియు, ౩-౦ అయినచో నాఫలంబనియు, ౨-పితృగండమనియు, ౪-మాతృగండమనియు నిట్లు స్త్రీవిషయమునందు వ్యత్యస్తఫలము జరుగును.

ఇఁక వ్యభిచారవిషయము.

వ్యా. ప్రశ్నాక్షర సంఖ్యా సమష్టిం స్త్రీనామ సంఖ్యా సమష్ట్యా సంగుణ్య సూర్యోదయాది గతఘటికాభిస్సంయోజ్య, మూల మాదాయ ద్వాభ్యాం విభజేత్, శేష మేకంచేన్నాస్తి వ్యభిచారః, శూన్యంచే దస్తీతి నిశ్చయః, తల్లబ్ధం శేషేణ సంయోజ్య,వర్గీకృత్య పంచభిర్విభజేత్, శేషఏకశ్చేత్స్వైరిణీ

ద్వయంచే త్వరబలాత్కారేణ, త్రయంచేదన్యస్త్రీమాధ్యస్థేన, చతుర్థంచేద్ధనేన, శూన్యంచే ద్భర్తృసమ్మత్యా, పునస్తల్లబ్ధం శేషేణ సంయోజ్య, తద్ఘనమూలం సంపాద్య సప్తభిర్విభజే దేకేనోత్తమవర్ణో, ద్వాభ్యాం సమవర్ణస్త్రిభి రల్పవయస్కశ్చతుర్భి ర్హీనవర్ణః, పంచభిః స్వగ్రామే, షడ్భిః పరగ్రామే శూన్యేన బహుభి రితి న ప్రకాశయేత్ప్రియేణ సర్వాసా మసై కాంత్యాల్.

## వివాహవిచారము.

వ్యా. ఆలింగితేన వివాహఏకేన, అభిధూమితే కష్టేన ద్వాభ్యామపి దగ్ధేనాస్తి. శూన్యేనాపి సంయుక్తేన వివాహః, అసంయుక్తేన అన్యగృహం కష్టాస్త్రీ, అభిహతే ద్వయోర్మరణం అభిఘాతే శ్వశురమరణం అభిధూమితే కన్యామరణం, అష్టాభిర్భాగః ఏకేన వివాహః, ద్వాభ్యాం కష్టేన వివాహః త్రిభిర్నాస్తి వివాహః, చతుర్భిః కన్యామరణం వా దుష్టతా వా వంధ్యా, పంచభిః కన్యా పితృ మరణం దేశాంతరగమనంవా, స్త్రీపృథాగమనంవా, షడ్భిస్సంయుక్తేన వరభంగః, సప్తభిర్ద్వయోర్మరణం, అష్టాభి ర్వ్యంగజమరణం పుత్రమరణం వా.

తా. అనగా ఆలింగత ప్రశ్నయందు శేషము, ౧-అయినచో వివాహమగును. అభిధూమితమున శేషము, ౨-అయినచో గష్టముచేత వివాహమగును. దగ్ధశూన్యములయందు [illegible]ము కలుగదు. సంయుక్తమున వివాహమగును. అసంయు

త్తమునందు బరగ్రహములోనుండు కన్యాప్రాప్తమగును. అభిహితముచే నిర్ధన కాయుండు తప్పకవగును.అభిఘాతమునఁ గన్యాపిత్రుగండము, అభిధూమితమునఁ గన్యాగండము, ఎనిమిదిచేత భాగించఁగా, ౧ వివాహసిద్ధి,౨ ప్రయాసమునలన వివాహము, 3 వివాహములేదు, ౪ కన్యకు విపత్తు కల్గును, ౫ కన్యాదాతృహానియు దేశాంతరమున కేఁగుటయునగును,అథవా కన్యలభించి తప్పిపోవును, ౬ సంయుక్తప్రశ్నకు వరునకు నాపద, ౭ దంతతులకు నాపద, అథవా కన్యాదాతకు నాపద, ౮ అంగలోపము, అథవా సంతానభంగ మగును.

## ఆయుష్యప్రశ్న.

శ్లో. ప్రశ్నాక్షరాంకరాశింతు విభజే ద్గుణసంఖ్యయా,
ఏకేన జీవనం ద్వాభ్యాం కష్టం శూన్యేన తన్మృతిః.

తా. అనఁగాఁ ప్రశ్నాక్షరాంక సమష్టి 3-తో భాగించినచో శేషము, ౧- బ్రతుకును, ౨ - కష్టసాధ్యము. ౦ - చనిపోవును.

## అథ కాలచారః.

వ్యా. ఏకేన వర్తమానః ద్వాభ్యాం భవిష్యత్కాలః శూన్యేన భూతకాలః.

తా. అనఁగాఁ బూర్వోక్తప్రశ్నాక్షరసంఖ్యాసమష్టిని మూఁడుభాగములు చేయఁగా ౧-వర్తమానకాలము,౨-భవిష్యత్కాలము, 3-భూతకాల మనియుఁ దెలియఁదగినది.

## నష్టజాతకప్రకరణము.

వ్యా. సంవత్సర మాస పక్ష తిథి వార సంఖ్యాతప్త మైన ప్రశ్నాక్షరాంకసమష్టి సంఖ్యయా తత్తత్సిద్ధిః. అత్రాయం శ్లోకః.—మాత్రాత్యేకగుణా ప్రోక్తా వ్యంజనం ద్విగుణంస్మృతం, తస్మానష్టం జన్మోక్తం మూలదేవేన భాషితమ్.

తా. అనఁగా నష్టజాతకకాలము నడిచిన సంవత్సర మాస పక్ష తిథి వార పరిమాణసంఖ్యచేతఁ బ్రత్యేకంబుగ నక్షర సమష్టిని భాగించఁగా శేషములు వరుసగా సంవత్సరాదులగును, దానితోవర్తమానకాలమును జేర్చి తెలుసుకొనుట పక్షాంతరము, స్వరములు వ్యంజనంబులను ద్విగుణింపవలయు నిట్లు మూలదేవుని వచనము.

వ్యా. అక్షరసంఖ్యా సమష్టి ర్భాజ్యాహారక భాగశేషైః ఫలాని జ్ఞేయాని.౧౦౮-హారకం శేషే ఆయురబ్దాః జన్మాబ్దో వా వర్తమానకాలాత్ప్రాగ్గణనే సృష్టిథవేత్,ద్వయంహారకం,శేషః పక్షః శ్శుక్లాదిః సప్తవింశతిహారకం శేషమశ్విన్యాది, యోగ స్తథా విష్కంభాదిః, త్రింశద్ధారకం శేషమంశః, ద్వాదశహార కం, శేషేణ ఫాల్గున చైత్ర కార్తిక మార్గశీర్ష పౌషమాఘ వైశాఖ జ్యేష్ఠాషాఢ శ్రావణ భాద్రపదాః, ద్వాదశభిరాశ్వయు జో మాఘోవా, ఏకాదిద్వాదశస్థానేషు న్యాంతశేషేణ మే షాది ద్వాదశలగ్నాని గ్రహసంస్థాఫలాదికం హోరాశాస్త్రోక్త మత్రోన్నేయ మితి శివమ్.

తా. అక్షరసంఖ్యాసమష్టిని హారకములతోఁ విభజింపఁగాఁ దచ్ఛేషము కాలం బగును. ౧౦౮-హారకం శేషం సంవత్సరం. అనఁగా జన్మసంవత్సరమగును.∴ ౬-౦-కిమీఁదరెండవచక్రమున, ౫౮-చేరవచ్చును. అథవా జన్మాదిగతాబ్దంబు లగును. ౨-హారకము, ౧-శుక్లపక్షము, ౨-కృష్ణపక్షము, ౨౭-హారకశేషము. అశ్విన్యాదినక్షత్రమగును. ఆదే ప్రకారము విష్కంభాదియోగము. ౩౦-హారకశేషము, శుక్లప్రతిపదాదిదినము, అథవా సౌరమానదినము, ౧౨-హారకశేషము, ౧-ఫాల్గునము, ౨-చైత్రము, ౩ కార్తికము, ౪-మార్గశిరము, ౫-పుష్యము, ౬-మాఘము, ౭-వైశాఖము, ౮-జ్యేష్ఠము, ౯-ఆషాఢము, ౧౦-శ్రావణము,౧౧-భాద్రపదము, ౧౨ ఆశ్వయుజము, అథవా మాఘము. ౧౨-హారకశేషము మేషాదిలగ్నము, తక్కిన గ్రహాచార ఫలమును హోరాశాస్త్రమువలనఁ దెలియనగును. శివమ్.

ఇది శ్రీమదాలూరు వంశాంబుధి రాకామృగాంక
రామకృష్ణదైవజ్ఞతనూభవ వాసుదేవాభిధేయరచి
తాంధ్రతాత్పర్యసహిత కేరళప్రశ్నము
సంపూర్ణము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1927.